# అథ పంచవింశో%ధ్యాయః

## పార్వతి గౌరి యగుట

వాయురువాచ |

తతః ప్రదక్షిణీకృత్య పతిమంబా పతివ్రతా | నియమ్య చ వియోగార్తిం జగామ హిమవద్గిరిమ్ || 1

తపః కృతవతీ పూర్వం దేశే యస్మిన్ సఖీజనైః | తమేవ దేశమవృణోత్తపసే ప్రణయాత్పునః || 2

తతస్స్వపితరం దృష్ట్వా మాతరం చ తయోర్గృహే | ప్రణమ్య వృత్తం విజ్ఞాప్య తాభ్యాం చానుమతా సతీ || 3

పునస్తపోవనం గత్వా భూషణాని విసృజ్య చ | స్నాత్వా తపస్వినో వేషం కృత్వా పరమపావనమ్ || 4

సంకల్ప్య చ మహాతీవ్రం తపః పరమదుశ్చరమ్ | సదా మనసి సంధాయ భర్తుశ్చరణపంకజమ్ || 5

తమేవ క్షణికే లింగే ధ్యాత్వా బాహ్యావిధానతః | త్రిసంధ్యమభ్యర్చయంతీ వన్యైః పుష్పై#్పైః ఫలాదిభిః || 6

స ఏవ బ్రహ్మణో మూర్తిమాస్థాయ తపసః ఫలమ్ | ప్రదాస్యతి మమేత్యేవం నిత్యం కృత్వా% కరోత్తపః || 7

తథా తపశ్చరంతీం తాం కాలే బహుతిథే గతే | దృష్టః కశ్చిన్మహావ్యాఘ్రో దుష్టభావాదుపాగమత్ || 8

తథైవోపగతస్యాపి తస్యాతీవ దురాత్మనః | గాత్రం చిత్రార్పితమివ స్తబ్ధం తస్యాస్సకాశతః || 9

తం దృష్ట్వాపి తథా వ్యాఘ్రం దుష్టభావాదుపాగతమ్ | న పృథగ్జనవద్దేవీ స్వభావేన వివిచ్యతే || 10

వాయువు ఇట్లు పలికెను -

తరువాత పతివ్రతయగు ఆ జగన్మాత భర్తకు ప్రదక్షిణమును చేసి వియోగదుఃఖమును అణిచి పెట్టుకొని హిమవత్పర్వతమునకు వెళ్లెను (1). ఆమె పూర్వము సఖీజనులతో గూడి ఏ స్థానములో తపస్సును చేసియుండెనో, మరల తపస్సు కొరకై ఆమె అదే స్థానమును ప్రేమ పూర్వకముగా ఎన్నుకొనెను (2). తరువాత ఆ పార్వతీ దేవి తన తల్లిదండ్రులను వారి గృహమునందు దర్శించి వారికి నమస్కరించి, జరిగిన వృత్తాంతమును విన్నవించి, వారి అనుమతిని పొంది (3), మరల తపోవనమునకు వెళ్లి, ఆభరణములను విడిచి పెట్టి, స్నానమును చేసి, తపశ్శాలురు ధరించే మిక్కిలి పవిత్రమగు వేషమును ధరించి (4), సర్వకాలములలో భర్తయొక్క పాదపద్మములను మనస్సులో నిలిపి, మిక్కిలి తీవ్రమైనది మరియు చేయుటకు చాల కష్టమైనది అగు తపస్సును చేయ సంకల్పించెను (5). ఆ శివుని ఉత్సవలింగమునందు ధ్యానిస్తూ మూడు సంధ్యలలో బాహ్యపూజావిధానముతో అడవిలో దొరికే పువ్వులతో పండ్లతో ఆరాధించెను (6). ఆ శివుడే బ్రహ్మ రూపమును దాల్చి వచ్చి నాకు తపస్సుయొక్క ఫలమును ఈయగలడని నిత్యము భావిస్తూ ఆమె తపస్సును చేసెను (7). ఈ విధముగా ఆమె తపస్సును చేయుచుండగా చాల కాలము గడిచెను. ఒకనాడు ఒక పెద్ద పులి హింసించ వలెననే తలపుతో ఆమె మీదకు వచ్చెను (8). మిక్కిలి చెడ్డ సంకల్పముతో ఆమె మీద మీదకు వచ్చిన ఆ పులి, బొమ్మ పులి వలె స్తంభించి పోయి నిలబడెను (9). ఆ విధముగా చెడు తలంపుతో మీదకు వచ్చిన పెద్దపులిని చూచి కూడా ఆ దేవి సామాన్య జనుని వలె తన ధ్యానమునుండి చలించలేదు (10).

స తు విష్టబ్ధసర్వాంగో బుభుక్షాపరిపీడితః | మమామిషం తతో నాన్యదితి మత్వా నిరంతరమ్ || 11

నిరీక్ష్యమాణస్సతతం దేవీమేవ తదా%నిశమ్ | అతిష్ఠదగ్రతస్తస్యా
ఉపాసనమివాచరత్ || 12

దేవ్యాశ్చ హృదయే నిత్యం మమైవాయముపాసకః | త్రాతా చ
దుష్టసత్త్వేభ్య ఇతి ప్రవవృతే కృపా || 13

తస్యా ఏవ కృపాయోగాత్సద్యో నష్టమలత్రయః | బభూవ సహసా
వ్యాఘ్రో దేవీం చ బుబుధే తదా || 14

న్యవర్తత బుభుక్షా చ తస్యాంగస్తంభనం తథా | దౌరాత్మ్యం
జన్మసిద్ధం చ తృప్తిశ్చ సమజాయత || 15

తదా పరమభావేన జ్ఞాత్వా కార్తార్థ్యమాత్మనః | సద్యోపాసక ఏవైష
సిషేవే పరమేశ్వరీమ్ || 16

దుష్టానామపి సత్త్వానాం తథాన్యేషాం దురాత్మనామ్ | స ఏవ ద్రావకో
భూత్వా విచచార తపోవనే || 17

తపశ్చ వవృధే దేవ్యా తీవ్రం తీవ్రతరాత్మకమ్ | దేవాశ్చ
దైత్యనిర్బంధాద్బ్ర హ్మాణం శరణం గతాః || 18

చక్రుర్నివేదనం దేవాస్స్వదుఃఖస్యారిపీడనాత్ | యథా చ
దదతుశ్శుంభనిశుంభౌ వరసమ్మదాత్ || 19

సో%పి శ్రుత్వా విధిర్దుఃఖం సురాణాం కృపయాన్వితః |
ఆసీద్దైత్యవధాయైవ స్మృత్వా హేత్వాశ్రయాం కథామ్ || 20

ఆకలిచే నిరంతరముగా పీడింపబడి స్తంభించిన సకలావయవములు
గల ఆ పులి ఈమె తప్ప నాకు మరియొక ఆహారము లేదని
భావించెను. అపుడు ఆ పులి ఎడతెరపి లేకుండగా సర్వకాలములలో
ఆమె వైపునకు చూచుచు ఆమెను ఉపాసించు చున్నదా యన్నట్లు
యెదురుగా నిలబడి యుండెను (11,12). ఇతి నిత్యము నన్నే
ఉపాసించుచున్నది; నన్ను క్రూరమృగముల బారి నుండి ఇది
కాపాడగలదు అని దేవియొక్క హృదయములో కూడ దయ పుట్టెను

(13). అపుడు ఆమె యొక్క దయాసంబంధముచే వెంటనే ఆ పులియొక్క మనోవాక్కాయముల యందలి దోషములు తొలగి పోయి, అది దేవిని తెలియగల్గెను (14). ఇంతే గాక, దాని శరీరావయవముల స్తంభనము తొలగి పోయి, దాని ఆకలి కూడ తీరెను. దానికి పుట్టుకనుండి వచ్చిన దుష్టబుద్ధి తొలగి పోయి తృప్తి కలిగెను (15). వెను వెంటనే అది పరమభక్తిభావముతో తన కృతార్థతను గుర్తించి ఉపాసకుని భావమును పొంది ఆ పరమేశ్వరిని సేవించెను (16). ఆ పులి క్రూరమృగములను, దుష్టబుద్ధి గల ఇతర ప్రాణులను తరిమి గొట్టుచూ ఆ తపోవనమునందు తిరుగాడెను (17). దేవియొక్క తీవ్రమగు తపస్సు మరింత తీవ్రముగా వర్ధిల్లెను. రాక్షసుల బాధల వలన దేవతలు బ్రహ్మను శరణు పొందిరి (18). తమకు శత్రువుల పీడ వలన కలిగిన దుఃఖమును, వరములను పొంది మిక్కిలి గర్వించియున్న శుంభనిశుంభులు తమకు కలిగించే ఇబ్బందులను ఆ దేవతలు బ్రహ్మకు విన్నవించుకొనిరి (19). ఆ బ్రహ్మ కూడా దేవతల దుఃఖమును గురించి విని దయతో కూడిన వాడై, తనకు శంకరునితో హేతుయుక్తముగా జరిగిన సంభాషణమును స్మరించి, రాక్షసుల వధ కొరకు ఆకాంక్ష గలవాడాయెను (20).

సామరః ప్రార్థితో బ్రహ్మ య¸° దేవ్యాస్తపోవనమ్ | సంస్మరన్మనసా దేవదుఃఖమోక్షం స్వయత్నతః || 21

దదర్శ చసురశ్రేష్ఠః శ్రేష్ఠే తపసి నిష్ఠితామ్ | ప్రతిష్ఠామివ విశ్వస్య భవానీం పరమేశ్వరీమ్ || 22

ననామ చాస్య జగతో మాతరం స్వస్యవై హరేః | రుద్రస్య చ పితుర్భార్యామార్యామద్రీశ్వరాత్మజామ్ || 23

బ్రహ్మాణమాగతం దృష్ట్వా దేవీ దేవగణైస్సహ | అర్ఘ్యంతదర్హం దత్త్వా%సై#్మ స్వాగతాద్యైరుపాచరత్ || 24

తాం చ ప్రత్యుపచారోక్తిం పురస్కృత్యాభినంద్య చ | పప్రచ్ఛ తపసో హేతుమజానన్నివ పద్మజః || 25

ఈ విధముగా ప్రార్థింపబడిన బ్రహ్మ దేవతలతో గూడినవాడై, దేవతలకు తన ప్రయత్నముచే కలుగవలసిన దుఃఖనివృత్తిని గురించి మనస్సులో తల పోస్తూ పార్వతీదేవియొక్క తపోవనమునకు వెళ్లెను (21). ఆయన గొప్ప తపస్సును దృఢముగా చేయుచున్నట్టియు, జగత్తునకు ఆధారము వలెనున్నట్టియు, పరమేశ్వరియగు భవానిని చూచెను (22). జగత్తునకు, తనకు, విష్ణువునకు మరియు రుద్రునకు కూడ తండ్రియగు శివుని భార్య, సర్వశ్రేష్ఠురాలు, పర్వతరాజు పుత్రిక యగు ఆ దేవికి ఆయన నమస్కరించెను (23). దేవగణములతో గూడి వచ్చియున్న బ్రహ్మను చూచి ఆ దేవి ఆయనకు తగిన విధముగా అర్ఘ్యమును ఇచ్చి స్వాగతమును పలికి ఉపచారములను సమర్పించెను (24). పద్మసంభవుడగు బ్రహ్మ ఆ ఉపచారములకు తగిన రీతిలో బదులు చెప్పి ఆమెను సత్కరించి అభినందించి తెలియని వాడు వలె ఆమె తపస్సును చేయటకు గల కారణమును గురించి ప్రశ్నించెను (25).

బ్రహ్మోవాచ |

తీవ్రేణ తపసానేన దేవ్యా కిమిహ సాధ్యతే | తపఃఫలానాం సర్వేషాం త్వదధీనా హి సిద్ధయః || 26

యశ్చైవ జగతాం భర్తా తమేవ పరమేశ్వరమ్ | భర్తారమాత్మనా ప్రాప్య ప్రాప్తం చ తపసః ఫలమ్ || 27

అథవా సర్వమేవైతత్క్రీడావిలసితం తవ | ఇదం తు చిత్రం దేవస్య విరహం సహసే కథమ్ || 28

బ్రహ్మ ఇట్లు పలికెను -

దేవి ఇచట ఈ విధముగా తీవ్రమగు తపస్సును చేసి దేనిని సాధించగోరుచున్నది? తపఃఫలములకు సంబంధించిన సిద్ధులన్నియు నీ అధీనములో నున్నవే గదా! (26) జగత్ప్రభువగు ఆ పరమేశ్వరునే భర్తగా పొందిన నీవు తపస్సుయొక్క ఫలము ను

పొందియే యున్నావు (27). లేదా, ఇదంతా నీ వినోదము కొరకు చేయబడే విలాసము మాత్రమే. కాని ఇది యొక చిత్రము గలదు. శివుని విరహమును నీవు ఎట్లు సహించుచున్నావు? (28).

దేవ్యువాచ |

సర్గాదౌ భవతో దేవాదుత్పత్తిః శ్రూయతే యదా | తదా ప్రజానాం ప్రథమస్త్వం మే ప్రథమజస్సుతః || 29

యదా పునః ప్రజావృద్ధ్యై లలాటోద్భవతో భవః | ఉత్పన్నో%భూత్తదా త్వం మే గురుః శ్వశురభావతః || 30

యదా భవద్గిరీంద్రస్తే పుత్రో మమ పితా స్వయమ్ | తదా పితామహస్త్వం మే జాతో లోకపితామహ || 31

తదీదృశస్య భవతో లోకయాత్రావిధాయినః | వృత్తమంతఃపురే భర్త్రా కథయిష్యే కథం పునః || 32

కిమత్ర బహునా దేహే యశ్చాయం మమ కాలిమా | త్యక్త్వా సత్త్వ విధానేన గౌరీ భవితుముత్సహే || 33

దేవి ఇట్లు పలికెను -

సృష్ట్యాదియందు నీవు పరమేశ్వరునినుండి జన్మించినావని వేదములు చెప్పుచున్నవి. ఆ ప్రసంగములో నీవు నా సంతానములో మొదటి కుమారుడవు (29)మరల సంతానము వర్ధిల్లుట కొరకై శివుడు నీ లలాటమునుండి పుట్టిన సందర్భములో నీవు నాకు మామగారు అగుటచే తండ్రితో సమానము అగుచున్నావు (30). ఓ సర్వలోకపితామహా! మరల, నాకు స్వయముగా తండ్రియగు పర్వతరాజు నీకు పుత్రుడైన సందర్భములో నీవు నాకు పితామహుడ వగుచున్నావు (31). లోకములను సృష్టించే ఇట్టి నీకు అంతఃపురములో నాకు భర్తతో జరిగిన వృత్తాంతమును ఎట్లు

చెప్పగలను ? (32) ఇన్ని మాటలేల? నా దేహమునకు గల ఈ నల్లదనమును సాత్త్వికమగు విధానములో విడిచి పెట్టి, నేను పచ్చని దానను కాగోరుచున్నాను (33).

బ్రహ్మోవాచ |

ఏతావతా కిమర్థేన తీవ్రం దేవి తపః కృతమ్ | స్వేచ్ఛైవ కిమపర్యాప్తా క్రీడేయం హి తవేదృశీ || 34

క్రీడా%పి చ జగన్మాతస్తవ లోకహితాయవై | అతో మమేష్టమనయా ఫలం కిమపి సాధ్యతామ్ || 35

నిశుంభశుంభనామానౌ దైత్యౌ దత్తవరౌ మయా | దృప్తౌ దేవాన్ ప్రబాధేతే త్వత్తో లబ్ధస్తయోర్వధః || 36

ఆలం విలంబనేనాత్ర త్వం క్షణ   న స్థిరా భవ | శక్తిర్విసృజ్యచమానా%ద్య తయోర్మృత్యుర్భవిష్యతి || 37

బ్రహ్మణాభ్యర్థితా చైవ దేవీ గిరివరాత్మజా | త్వక్కోశం సహసోత్సృజ్య గౌరీ సా సమజాయత || 38

సా త్వక్కోశాత్మనోత్సృష్టా కౌశికీ నామ నామతః | కాలీ కాలాంబుదప్రఖ్యా కన్యకా సమపద్యత || 39

సా తు మాయాత్మికా శక్తిర్యోగనిద్రా చ వైష్ణవీ | శంఖచక్రత్రిశూలాదిసాయుధాష్టమహాభుజా || 40

సౌమ్యా ఘోరా చ మిశ్రా చ త్రినేత్రా చంద్రశేఖరా | అజాతపుంస్పర్శరతిధృష్యా చాతిసుందరీ || 41

దత్తా చ బ్రహ్మణ   దేవ్యా శక్తి రేషా సనాతనీ | నిశుంభస్య చ శుంభస్య నిహంత్రీ దైత్యసింహయోః || 42

బ్రహ్మణాపి ప్రహృష్టేన తస్యై#్మ పరమశక్తయే | ప్రబలః కేసరీ దత్తో వాహనత్వే సమాగతః || 43

బ్రహ్మ ఇట్లు పలికెను -

ఓ దేవీ! ఇంతటి చిన్న ప్రయోజనము కొరకై తీవ్రమగు తపస్సును ఏల చేసితివి? దీని కొరకై నీ సంకల్పమాత్రము చాలదా? ఇట్టి తపస్సు నీకు క్రీడయే సుమా! (34) ఓ జగన్మాతా! నీ క్రీడ కూడ లోకములకు హితమును చేగూర్చును. కావున, నీ వు ఈ తపస్సుచే నాకు అభీష్టమగు ఫలమును దేనినైననూ సంపాదించుము (35). నిశుంభశుంభులనే ఇద్దరు రాక్షసులకు నీ చేతిలో మరణము కలుగునట్లు నేను వరముల నిచ్చితిని. వారు గర్వించి దేవతలను బాధించు చున్నారు (36). ఈ విషయములో విలంబము వలన ప్రయోజనము లేదు. నీవు క్షణకాలము స్థిరముగా నుండుము. ఇప్పుడు విడువబడ బోయే శక్తి వారిద్దరిని సంహరించ గలదు (37). ఈ విధముగా బ్రహ్మ ప్రార్థించగా, పర్వతరాజపుత్రిక యగు ఆ దేవి వెంటనే శరీరముయొక్క పై చర్మమును విడిచి పెట్టి పచ్చని దేహవర్ణము గలది ఆయెను (38). తాను విడిచి పెట్టిన ఆ పై చర్మము నల్లని మేఘము వలె ప్రకాశించే కౌశికి అనే కన్యకరూపమును దాల్చెను (39). మాయ (పార్వతి) యొక్క స్వరూపమగు ఆ శక్తి విష్ణువుయొక్క యోగనిద్ర అయినది. ఆమె శంఖము, చక్రము , త్రిశూలము మొదలగు ఆయుధములతో కూడిన ఎనిమిది పెద్ద భుజములను కలిగి యుండెను (40). మూడు కన్నులు గలది, చంద్రవంకను శిరస్సుపై దాల్చినది, పురుషస్పర్శను మరియు రతిని యెరుంగనిది, గొప్ప సౌందర్యము గలది అగు ఆమెకు సౌమ్య (ప్రసన్నము), ఘోర(భయంకరము), మరియు మిశ్ర (రెండింటి కలయిక) అనే మూడు రూపములు గలవు (41). నిశుంభశుంభులనే రాక్షసశ్రేష్ఠులను సంహరించే అనాది యగు శక్తిని బ్రహ్మ ఆ దేవికి ఇచ్చెను (42). మరియు బ్రహ్మ చాల సంతోషించి మహాశక్తిస్వరూపిణి యగు ఆమెకు వాహనముగా నుండుట కొరకై అచటకు వచ్చియున్న గొప్ప బలము గల సింహమును ఇచ్చెను (43).

వింధ్యే చ వసతిం తస్యాః పూజామాసవపూర్వకైః |
మాంసైర్మత్స్యైరపూపైశ్చ నిర్వర్త్యాసౌ సమాదిశత్ || 44

సా చైవ సంమతా శక్తిర్బ్రహ్మణో విశ్వకర్మణః | ప్రణమ్య మాతరం గౌరీం బ్రహ్మాణం చానుపూర్వశః || 45

శక్తిభిశ్చాపి తుల్యాభిస్స్వాత్మజాభిరనేకశః | పరీతా ప్రయ¸° వింధ్యం దైత్యేం ద్రౌ హంతుముద్యతా || 46

నిహతౌ చ తయా తత్ర సమరే దైత్యపుంగవౌ | తద్బాణైః కామబాణైశ్చ ఛిన్నభిన్నాంగమానసౌ || 47

తద్యుద్ధవిస్తరశ్చాత్ర న కృతో%న్యత్ర వర్ణనాత్ | ఊహనీయం పరస్మాచ్చ ప్రస్తుతం వర్ణయామి వః || 48

ఇతి శ్రీశివమహాపురాణ వాయవీయసంహితాయాం పూర్వఖండే దేవీగౌరత్వభవనం నామ పంచవింశో%ధ్యాయః (25).

ఆయన ఆమెను మద్యము, మాంసములు, చేపలు, అప్పములు అను వాటితో పూజించి వింధ్య పర్వతముపై నివాసమును నిర్దేశించెను (44). ఈ విధముగా సన్మానించబడిన ఆ శక్తి తల్లియగు గౌరికి, జగత్తును సృష్టించే బ్రహ్మకు వరుసగా నమస్కరించెను (45).తననుండి పుట్టి తనతో సమానమైన అనేకులగు శక్తులతో ఆమె చుట్టువార బడినదై, ఆ రాక్షసవీరులను సంహరించుటకు సిద్ధపడి వింధ్య పర్వతమునకు వెళ్లెను (46). ఆమె అచట ఆ రాక్షసవీరులను యుద్ధములో సంహరించెను. మన్మథుని బాణములచే కొట్ట బడిన మనస్సులు గల ఆ రాక్షసుల దేహములను ఆమె తన బాణములతో కొట్టి సంహరించెను (47). ఆ యుద్ధము మరియొక చోట వర్ణించబడి యుండుటచే ఇచట వర్ణించ బడుట లేదు. మరియొక స్థానమునుండి ఆ వివరములను తెలియవలెను. నేను మీకు ప్రస్తుతవృత్తాంతమును వర్ణించెదను (48).

శ్రీ శివమహాపురాణములోని వాయవీయసంహితయందు పూర్వఖండములో పార్వతి గౌరి యగుటను వర్ణించే ఇరువది అయిదవ అధ్యాయము ముగిసినది (25).